Annual Subscription Rs. 2/-only.

# BHEEMA PATRICA

# భీమాపత్రిక

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU





VOL. V BEZWADA—NOVEMBER 1936 No. 11

# Mr. Marathey's Message

**G. S. MARATHEY,** M. A. (Bom.) A. I. A. (Lond.)
*Actuary.*
(Tel. address : Counts as three words.)
" Marathey Actuary Poona D. G. "
(Local address for personal visit)
Servants of India Society's Road,
near Fergusson College.

POONA No. 4 (India).
*Dated 31st October 1936.*



Dear Mr. Pantulu,

I congratulate you on your Conference Number of the Bheema Patrika and am glad to read the account of the Third Agent's Conference. The Agents in Andhra Province deserve great credit for the spirit of Co-ordination which is indicated by these Conferences.

From the accounts given in the Patrika, of the Second Conference over which I had the pleasure to preside, I find that there is a deficit of Rs. 28-and odd I am sorry there should have been a deficit and in memory of the great cordiality shown by you and many other Andhra gentlemen connected with the last year's Conference, I am sending you a sum of Rs 20 by two postal orders Nos. D 181990/91 for Rs 10 each drawn in your favour, towards making up the deficit

The Andhra people have something remarkable about them and I thank you for having brought me into contact with them. I wish the Agents' Association a useful career and feel confident that your next conference in the East Godavary District will be a great success.

Please remember me to Mr. V. L. Sastri, Mr. Krishna Rao and others who remember me.

Yours sincerely,

(Sd.) G. S. MARATHEY.

Encl. 2 Postal orders.

To

S. KANAKA RAJU Pantulu Esq.,
Bezwada.

రామవరపు వెంకట్రావు,
బ్రాంచి సూపరింటెండెంటు,
పీనస్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

బెజవాడ,
25—10—36.

# శ్రీ సూరంపూడి కనకరాజు పంతులుగారికి

భీమాపత్రికా సంపాదకులు, బెజవాడ.

ప్రియమిత్రమా!

భీమాప్రతినిధుల తృతీయ మహాసభాసందర్భమున తాము ప్రకటించిన భీమాపత్రికప్రత్యేకసంచికను సకాలములో నందుకొంటిని. అధిక వ్యయ ప్రయాసములకు లోనై తాము యీసంచికను ప్రకటింపగలిగియుందురని తలంచెదను. భీమాకంపెనీలవలనగాని సోదర ప్రతినిధివర్గముచేగాని తగు ప్రోత్సాహము లేకున్నను ఉత్సాహాతిశయముతో తాము ఆంధ్రభీమా లోకమునకు యొనర్చుచున్న సేవ అపారము.

ఏతత్ప్రత్యేక సంచికయు అమూల్య వ్యాసములతో నలరారుచు, భీమాప్రతినిధులకు అత్యంతోపయోగకరముగా నున్నదనుటకు సందేహములేదు. అందు బ్రహ్మశ్రీ చె॥ వేం॥ నరసింహం పంతులుగారి వ్యాసరాజము యీప్రత్యేకసంచికకు ప్రథమాలంకారము. శ్రీ పంతులుగారి వ్యాసరచనానైపుణ్యమున, భీమాకంపెనీలవారు ప్రతినిధులను తడిగుడ్డలతో గొంతుకకోయుటలు విపులముగా వివరింపబడినవి.

ప్రతినిధులపట్ల భీమాకంపెనీ లొనర్చెడి అక్రమచర్యను తీవ్రరీతి విమర్శించి సక్రమాందోళన మొనరింప, తమ పత్రికారాజము ప్రతినిధిపక్షమునకు ప్రథమ సోపానమగుగాక యని కోరుచున్నాను.

మరియు ద్విగుణీకృతోత్సాహముతో తాము "భీమా" సేవ యొనర్చుటకు మీకు ఆయురారోగ్యములు చేకూరుగాక!

రా॥ వెంకట్రావు.




I

# భీమాపండితసంఘ తీర్మానములు

## Insurance Expert Committee recommendations.

హిందూదేశ భీమాచట్ట సవరణ సందర్భములో శ్రీయుత సుశీలసేన్‌గారిచే తయారు చేయబడిన భీమాచట్ట సవరణ రిపోర్టునుగూర్చి పరిశీలించి ఆవిషయములో ప్రభుత్వమువారికి తగిన సిఫార్సులు చేయుటకుగాను ఇండియా ప్రభుత్వమువారు లామెంబరగు సర్. ఎన్. ఎన్. సర్కారుగారి అధ్యక్షతక్రింద ఒకభీమాపండితసభ (Insurance Expert committee) ను ఏర్పాటుచేసి యున్నారు. ఈసభవారు న్యూఢిల్లీలో 1936 నవంబరు 2 వ తేదీని సమావేశమై 13 వ తేదీ ఆఖరుకు 12 దినములలో శ్రీయుత సుశీలసేన్‌గారి రిపోర్టును పరిశీలించి తమ అభిప్రాయములను ప్రభుత్వమువారికి పంపియుండిరి. ఈరిపోర్టును ఆధారముగా గొని ప్రభుత్వము వారు 1937 సం॥ ఫిబ్రవరి మొదటివారములో అసంబ్లీలో బిల్లును ప్రవేశపెట్టనున్నారు. ఆబిల్లును వెంటనే సెలెక్టుకమిటీకి రిఫరుచేసి త్వరలో చట్టము చేసెదరు. ఈప్రత్యేక సభలో భీమా పట్టాదారుల యొక్కయు ఈ వ్యాపారమును సమకూర్చుటకు మూలాధారులగు ఏజంట్ల యొక్కయు కష్టములనుగూర్చి తెల్పుటకు వీరి ఉభయుల తరఫున సభ్యులను ఏర్పాటుచేసి యుండలేదు. ఈ ప్రత్యేకసభలో ప్రభుత్వపు సభ్యులిద్దరు తప్ప మిగిలినవా రందరును ఏకంపెనీలకో మేనేజర్లే అయివున్నారు. దీనిని బట్టి చూచిన ఈ సభవారి తీర్మానములు కంపెనీల వ్యాపారమునకు అనుకూలముగా వుండక తప్పవని ఊహించవలసివచ్చుచున్నది. ఈ సభవారు చేసే తీర్మానములు పట్టాదారులకుగాని అహర్నిశములు కష్టపడి పనిచేయు ఏజంట్లకుగాని ప్రయోజన ముండునని తోచదు. తమ కాయుష్యము, తమ కారోగ్యము అన్నట్లు కంపెనీలవారు తమపై విదేశపుకంపెనీల దాడి లేకుండునట్లును, ఏజంట్లపైనను పట్టాదారులపైనను కఠినషరతులను విధించుటలో తమవీలునే చూచుకొనుచున్నారుగాని ఏజంట్లయొక్కగాని పట్టాదారులయొక్కగాని క్షేమమును యోజించుటలేదు. ఈ భీమాచట్టసవరణసందర్భములో పట్టాదారులుతరఫున గాని ఏజంట్లతరఫున గాని మాట్లాడుటకు సభ్యుడులేని ఈ పండితసభను నిర్మించుటలో ఇండియాప్రభుత్వమువారి అభిప్రాయ మేమో తెలియకున్నది. ఏజంట్లయొక్కయు పట్టాదారుల

యొక్కయు క్షేమము ఆలోచింపవలసిన అవసరము లేదనియా ఇండియాప్రభుత్వము వారి అభిప్రాయము ? లేక హిందూ దేశ భీమావ్యాపారమును అణగద్రొక్కి, హిందూదేశములో విదేశపు కంపెనీల భీమావ్యాపారమును విరివిగా విస్తరింపజేయవలయు ననియా ? లేకున్నచో ఈ సభలో ఏజంట్ల తరఫునను, పట్టాదారుల తరఫునను, మాట్లాడుటకు ఒక సభ్యుని యేల నియమింపకుండుగు? ఏది యెట్లున్నను ఈపండిత సభవారు చేసిన తీర్మానములను గూర్చి కొంత వరకు యోచింపవలసియున్నది.

ఈ కమిటీవారు ఓరియంటల్ కంపెనీయొక్క జనరల్ మేనేజరు జోన్సుగారియొక్కయు, న్యూ ఇండియా జనరల్ మేనేజరు, డఫ్‌గారియొక్కయు సాక్ష్యములను పుచ్చుకొనిరి. ఈ కమిటీవారు శ్రీయుత సేన్ గారి రిపోర్టులోని సిఫార్సులన్నిటిని కొంచె మించు మించుగా అంగీకరించి యున్నారు. ఈ వ్యాపారమును చేయుటకు తగిన విద్యాఅర్హతగలిగి యిందులకు సంబంధించిన సాంకేతిక విజ్ఞానముతో గూడిన క్రమశిక్షను పొంది ప్రభుత్వమువారిచే లైసెన్సునుపొందినఏజంట్లే యీ వ్యాపామును చేయుటకు అర్హులనియు, యింతటినుండి యేజంట్లను రిజిస్ట్రీషను చేయవలసినదిగా సిఫార్సు చేయుచున్నారు.

ఏజంట్లను రిజిస్టరుచేసి వారలకు లైసెన్సులను యిచ్చుట చాల యుక్తమైనపని. ఇందువలన సంఘములో ఏజంటుకు ఇప్పటికంటె గౌరవను వృద్ధియై సంఘములో తనయొక్క వ్యాపార గౌరవమును పొందుననుటకు సందేహములేదు. ఏజంట్లను రిజిస్టరీచేయుట, వారికి లైసెను నిచ్చుట చాల ముఖ్యమైన విషయము. ఇప్పటికంటె ఏజంటుయొక్క గౌరవమును పెంచవలె ననిన ఈ లైసెన్సుపద్ధతిని ప్రభుత్వమువారు తప్పక అమలులోనికి తీసుకొనిరావలసియున్నది. కాని ఇంతకంటె ప్రధానములగు ఏజంట్ల కష్టములను తొలగించి ఈ వ్యాపారాభివృద్ధికి తోడ్పడువారి కనుకూలమగు వసతులనుగూర్చి ఆలోచించకపోవుట కడు శోచనీయము.

హిందూదేశపు భీమావ్యాపారముతో పోటీ చేయుటకుగాను హిందూ దేశములో అమలులో నున్న ప్రీమియము రేట్లకంటె, తక్కువరేట్లతో విదేశకంపెనీలవారు భీమాపట్టాలను జారీచేయుచున్నారను విషయమునుగూర్చి విచారింపవలసినదని కోరగా ఈ కమిటీవారు అట్టివిషయములను నిరూపించుటకు యేమియు ఆధారములులేవని ఆవిషయమును త్రోసిపుచ్చిరి. ప్రావిడెంటు కంపెనీల విషయములో యిప్పుడు వ్యాపారముచేయుచున్న కంపెనీలవద్దనుండియు, యికముందు పెట్టబోవు కంపెనీలవద్దనుండియు తగినధరావతులను పుచ్చుకొనుట అవసరమనియు వారిఆస్తిఅప్పుల విలువ యెప్పటికప్పుడు పెద్దకంపెనీలవలె ఆస్తిఅప్పుల విలువమదింపు (Acturial Valuation) వేయించుట అవసరమనియు వారియొక్క వివిధవ్యాపారస్కీములను అమలులోనికి పెట్టుటకు ముందుగా భీమాశాస్త్రవేత్త సర్టిఫికెట్టుపొందుట అవసరమనియు, ప్రావిడెంటుసొసైటీలన్నియు తమ కంపెనీపేరులో ప్రావిడెంటు అనుమాట యుండవలెననియు ప్రావిడెంటుకంపెనీలవిషయములో పైన చేసిన సిఫార్సులన్నియు, యిప్పుడున్న ప్రావిడెంటుకంపెనీలకున్నూ, ముందు పెట్టబోవు ప్రావిడెంటుకంపెనీలకు గూడ వర్తించునట్లు సిఫార్సుచేసియుండిరి. ప్రావిడెంటు కంపెనీల విషయములో ఈ కమిటీవారి సిఫార్సులు చాల సమంజసముగ నున్నవి.

హిందూదేశములో, విదేశపుకంపెనీలు సమకూర్చు వ్యాపారముకు తగిన పెట్టుబళ్లను,

[ 214 వ పేజీలో చూడుడు. ]



# రిబేటు

**శ్రీ శనివారపు సుబ్బారావుగారు**

దీనిఅర్థమేమంటే ఒకవస్తువు కొనదలచిన వారు ఆవస్తువుల అసలుఖరీదులో ఎంతతక్కువకు యియ్యగలవని తమవద్దకు అమ్మతెచ్చిన ఏజంట్లను అడుగుతారు. అంటే ఒకరు 50 వేల రూపాయలకు తన జీవితమును భీమాచేయదలచినపుడు ఆయనజీవితమును భీమాచేయించుటకు ప్రతి కంపెనీఏజంటు ఆయనచుట్టూ తిరుగుతాడు. ఆ తిరగడాన్నిబట్టి నీవేమికమీషనుయిస్తావు నీవేమి కమీషనుయిస్తావని తమదగ్గరకువచ్చిన ఏజంట్లందరని అడుగుతాడు. అలా అడగడంలో ఏ ఏజంటు హెచ్చుకమీషనుయిస్తే ఆ ఏజంటుకే 50 వేల రూపాయల పాలసీని యిస్తాడు. కంపెనీగాక కంపెనీయొక్క ఏజంటు పట్టాదారుకు తన కమీషనులోవదిలేకమీషనుకే రిబేటుఅంటారు. ఈరిబేటుపద్ధతివల్ల ఏజంట్లవృత్తికి అగౌరవం నిలకడ లేకుండా వుంటోంది. ప్రతికంపెనీ హెచ్చుగా ఏజంట్లను పెట్టడం, ఆర్గనైజర్లని వేయడం, జరుగుతోంది. ఆర్గనైజర్లు తమ నెలసరి జీతాలకొరకున్నూ, తమఏరియాలో నిచ్చే వ్యాపార పరిమితి వుండుటకున్నూ ఏజంట్లను హెచ్చుగా పెట్టి రిబేటుమంత్రాన్ని ఏజంట్లకు పరోక్షంగా ఉపదేశం చేస్తూవుంటారు. ఏజంట్లలో కొంచెం డబ్బువున్నవాడు, మరో యితరవృత్తి వున్నవాడు తన కమీషనులో కొంత పాలసీదార్లకు యిస్తానను మిషతో వ్యాపారాన్ని హెచ్చుగా సాగింపజేస్తాడు.

మొదటివత్సరం ప్రీమియముమీద వచ్చే కమీషనుకుగాక తరువాతవచ్చే రెన్యూఅల్ కమీషనుకోసమే యిట్టి ఏజంట్లు పాకులాడుతూ వుంటారు. ఏమాత్రం యితర ఆధారంలేని భీమా ఏజంటు రిబేటు యియ్యడానికి జూడక బ్రతిమాలో, పాకులాడో చిన్నచిన్న పాలసీదార్లను జూచుకుని రిబేటు యియ్యకుండా తంటాలుపడతాడు. దీనినిబట్టి అర్థంచేసుకొనేదేమంటే బలసిన ఇన్సూరెన్సుకంపెనీలు హెచ్చురిబేటు కమీషనుయిచ్చి అందుండి రిబేటు యియ్యమనేసంగతిని పరోక్షంగా ఆర్గనైజర్లద్వారాగాని లేక ఇనస్పెక్టర్లద్వారాగాని ఏజంట్లకు తెలిపేటట్టుచేసి, ఆరీతిగ హెచ్చువ్యాపారాన్ని రాబట్టుకోదలుస్తారు. చిన్నచిన్నకంపెనీలవారు(బక్కకంపెనీలు) హెచ్చురేటు కమీషనుయిచ్చి రిబేటుకుప్రోత్సాహించలేరు. ఈ కారణంతో బక్కకంపెనీలు హెచ్చువ్యాపారాన్నిచేయలేవు. బక్కయేజంట్లు హెచ్చువ్యాపారాన్ని సాగించలేరు. కాబట్టి ఏవిధంగా జూచినా మెరకనీరు పల్లానికే వెళ్లును. పల్లంలోనినీరు పల్లంలోనేవుంటూ ఎప్పుడు నిండుగానే వుండుననుసామెతగా బలసినఏజంట్లు, బక్కఏజంట్లు, బలసినకంపెనీలు, బక్కకంపెనీలు, మున్నగువాటిలో, బలసినవాటికే హెచ్చుస్థానంవున్నట్లు కనబడుతోంది. ఈ విషయమై కంపెనీలవారు ఏజంట్లను నిందించుతూవుంటారు అఖిలభారత భీమాకంపెనీలసంఘతీర్మానములనుగాని వారివార్షికరిపోర్టులనుగాని చదివిన యీ విషయమై వారుచేసిన ఖండనలే తప్పనిసరియైనమార్గమేదో నిరూపించినటుల కనబడదు. అఖిల భారత భీమా ఏజంట్ల సంఘంవారు యీ విషయం

[ 205 వ పేజీలో చూడుడు. ]



# రూపాయివిలువ తగ్గించుట ప్రమాదము

## ప్రొఫెసరు థామస్ గారి అభిప్రాయము

ప్రొఫెసరు థామస్‌గారు మదరాసు విశ్వవిద్యాలయముపక్షమున మూడు ఉపన్యాసములను ఈ విషయమునుగూర్చి ఇచ్చుచున్నారు. అందు మొదటిదాని సారాంశము ఇచటముద్రించితిమి.

మద్రాసు విద్యాపీఠమునందు అర్థశాస్త్ర పండితుడగు ప్రొఫెసరు థామస్‌గారు గురువారమునాటి సాయంకాలమున యూనివర్సిటీ భవనమున ఉపన్యసించిరి. "కరెన్సీవిలువతగ్గింపు" అను విషయమునుగూర్చి వీరు మూడు ఉపన్యాసముల నిచ్చునట్లు విద్యాపరిషత్తువారు నియోగించిరి. ఆమూడింటిలో ఇది మొదటిఉపన్యాసము.

డాక్టరు థామస్‌గారు చెప్పిన విషయముల సారాంశము యీ క్రింద వివరించి యున్నది.

అనేక దేశములు ఇటీవల తమ కరెన్సీనాణెములవిలువ తగ్గించుకొనుటకు ఆరంభించినవి. ఆర్థికదుస్థితి మాన్పుటకు ఆదేశములు చేయుచుండెడి నానావిధ ప్రయత్నములలో నిదియు నొకటి. చాలకాల మీవిధానము నవలంబించుటకు ఆయాదేశములు సంకోచించినవి. తుదకు గత్యంతరము కానక యీవిధానము అవలంబించినవి. అంతేకాని దీనివలన ఏమో లాభములు పొందవచ్చునని కాదు.

ఇండియాలోకూడాఅయాచితముగరూపాయి విలువ తగ్గినది. బంగారు విలువకునుగల తారతమ్యము పూర్వముకంటె ఇప్పుడు నూటికి 37 వంతులు తగ్గియున్నది. ఇది చాలక ఇంకను తగ్గింపవలయునని వర్తకులు కొందరు కోరుచున్నారు. ఇందువలన లాభములేదు సరేకదా నష్టముకూడ కలుగును అని వారికి తెలియక పోవుటయే ఇట్టి కోరికకు ముఖ్యకారణము.

1890, 1931 సంవత్సరములలో ఎగుమతులు కొంత తగ్గియుండినవి కాని ఇప్పుడు మరల హెచ్చగుచున్నవి. అందుచేత లండనులో బాకీలు చెల్లించుట రానురాను సుకరమగుచున్నది. మన దేశమున ద్రవ్య సౌకర్యము పుష్కలమగుచున్నది. మన దేశపు ముడివస్తువుల ధరలు విదేశస్థులు అచ్చుకోలేనంత ఎక్కువగ వెలలు పెరిగిపోలేదు. మరియెందుకు రూపాయివెల ఎక్కువ అనుకొనుచున్నారో తెలియజాలను.

మనము బంగారమును ఎగుమతి చేయుచుండుట వాస్తవమే. అయితే అది బొక్కసములలోఅవసరములకై నిలువయుంచిన బంగారము కాదు. ఇండ్లలో పూడ్చిపెట్టుకొని నిష్ప్రయోజనముగ పడియుండినదే. అట్టి బంగారమును అమ్ముకొనుటవలన విదేశవస్తువులు కొనుటకు హిందూదేశ ఆర్థికబలము జాస్తి అగునుగాని తగ్గదు.

స్టెర్లింగు సవరనుకును ఇండియను రూపాయి

కని మారకపు రేటు 1927 సం॥లో నిర్ణయించిరి. రూపాయి ఒకటికి 18 పెన్నీలు అని అప్పుడు నిర్ణయించిరి. ఈ రేటు ఎక్కువ. 16 పెన్నీలు ఉండుట సహజమట! ఆ మాటకు అర్థము అది చెప్పువారికే తెలియును. ఈవాదము సరిలేదు, అని ప్రొఫెసరు చబ్లానీగారు ఆసమయములోనే సకారణముగ నిరూపించియుండిరి. దేశపరిస్థితి 1927 వ సంవత్సరముకంటె ఇప్పుడు బాగున్నది. గత అయిదు సంవత్సరములనుండి ఆర్థిక పరాక్రమముగల దేశము లనేకములు తికమకలాడినను హిందూదేశము తలయెత్తి తిరుగుచునే యున్నది.

ఇప్పుడు రూపాయివిలువ తగ్గించినచో మన దేశపు ఎగుమతులు హెచ్చునని, బంగారుఎగుమతి తగ్గునని, సరకుల వెలలు హెచ్చునని సంయుక్తవాణిజ్య సంఘాధ్యక్షులగు క్లైటాన్ ప్రభృతులు ఆశించుచున్నారు. వీరి వాదములోని సత్యాసత్యములను విమర్శించెదను.

ఇతర పరిస్థితులు ఏవియు ఆవంతయయినను మార్పుచెందనిచో రూపాయివిలువ తగ్గించిన యెడల, ఎగుమతి హెచ్చుననుమాట వాస్తవమే కాని గత అయిదేండ్ల అనుభవమునుబట్టి మన దేశపు ఎగుమతులు నాణెపు విలువపై ఆధారపడలేదని స్పష్టపడినది. నాణెమువిలువకంటె ఇతర పరిస్థితులమార్పులే ఎగుమతుల హెచ్చుతగ్గుదలలకు కారణభూతములని నిర్వివాదముగ తెలిసిపోయినది 1931 లో నాణెమువెల తగ్గినపుడు ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, అమెరికా దేశములతో మన వ్యాపారము హెచ్చలేదు 1933 వరకు ఒటావా ఒడంబడిక అమలుకు రానందున దానిని ఒకకారణముగ యీసందర్భమున చెప్పుట సరికాదు. ఆయాదేశములు తాము దిగుమతి చేయు సరకులపై విధించిన విపరీతసుంకములు, ఇతర విధములైన వ్యాపార ప్రతిబంధకములే ఇందుకు సరియైన కారణములు.

బంగారుఎగుమతి

రూపాయికి 16 పెన్నీలు మారకపు రేటు విధించినచో బంగారుఎగుమతి తగ్గునని, అట్లు తగ్గుట దేశమునకు లాభమని కొందరిభావన. యుగయుగములుగా పూడ్చిపెట్టిన బంగారు దాచుకొనుటచేత ఎవరికి లాభము? చేతులు మారుచుండవలసిన వస్తువును పాతరవేసినందువల్ల ఫలమేమి? బంగారమువ్యాపారముకూడ ఇతర వ్యాపారములవంటిదే. ఇతరవస్తువులకంటె దీనియందు లాభము చాలయెక్కువ. దేశమునకు ధనము గావలసిన సమయములో, విదేశీయులు యెక్కువ వెలపెట్టి బంగారు కొనుటకు సిద్ధపడియుండునపుడు, దాచిపెట్టుకొన్న బంగారమును లాభమునకు 'అమ్ముకొనుటకన్న మంచిపని యుండదు. 1900 సంవత్సరము మొదలు నేటివరకు ఇండియాలో 800 కోట్ల విలువగల బంగారము వ్యవహారము లోకమునకు బాహ్యమయిపోయినది ఇందులో మూడవవంతే నేటివరకును ఎగుమతి అయిన బంగారము కాబట్టి బంగారు ఎగుమతి దేశమునకు ఆర్థికముగ లాభకారి. ఇతర ఏదేశములలో మూలధనముగ బ్యాంకులు దాచిపెట్టిన బంగారువిలువతో నీదేశములోని బంగారును పోటీపెట్టి చేసెడు వాదన పరిశీలనకు నిలువదు.

వస్తువుల వెలలు

ముడిదినుసుసరకుల వెలలకును, తయారైన సరకుల వెలలకును కల వ్యత్యాసములచేత దేశముయొక్క ఆర్థిక దార్ఢ్యము హైన్యమునొందుచుండును. క్రమక్రమముగ ప్రపంచ ఆర్థిక పరిస్థితి బాగుపడినప్పుడే ఇట్టి దుస్థితికి మోక్షము

కలుగును కాని, రూపాయివిలువ తగ్గించుట కాదు దీనికి తగినమందు. ఇతర దేశముల, సరకుల వెలలు హెచ్చకుండు విధానములను సంకల్పించు చుండగా హిందూ దేశమున మాత్రము ఇట్టి విషమ ప్రయత్నములు చేయుట చూడ విచిత్రముగ కనుపించును. వస్తువులు కావలెనను కోరిక ప్రబలవలయును కొనగోరువారి సంఖ్య హెచ్చ వలయును. ఇందుకు ప్రజలయందు ఉద్యోగము హెచ్చవలయును. వెలలు హెచ్చ వలయునన్న ఉద్యోగము హెచ్చించుట సాధు మార్గము కాని మారకపు రేటు తగ్గించుట కాదు. హఠాత్తుగ రేటుతగ్గించినపుడు వెలలు కొంత హెచ్చుననియే వాదముకొరకు ఒప్పుకొన్నను అందుచేత ఇండియాకు లాభమున్నట్లుకనబడదు. స్టర్లింగ్ విలువ నూటికి 18 వంతులు తగ్గినపుడు సరకుల వెల 8 వంతులు మాత్రమే హెచ్చినది. అదేకాలమున యిండియాలో సరకుల వెల 5 వంతులు మాత్రమే హెచ్చినది. ఇంగ్లాండు తయారుచేయు సరకులలో నూటికి 50 వంతులు ఎగుమతియగును. ఇండియాలో తయారైనవి నూటికి 5 మొదలు 7 వంతులే ఎగుమతియగును. కాబట్టి మారకపు రేటు తగ్గుట వలన ఇండియాకు కలిగెడి సద్యఃప్రయోజనము అతిస్వల్పము. ఆస్వల్పప్రయోజనముకూడ అధిక వడ్డీలకు అప్పిచ్చు షావుకార్లును, దలార్లును సంపాదించుకొందురే కాని వ్యవసాయదార్ల వరకు ప్రసరింపజాలదు.

మన దేశమున వ్యవసాయదార్లలో ఎగుమతి కొరకు పండించువారి సంఖ్య స్వల్పము. తాము తినుటకొరకు పండించువారిసంఖ్య అధికము. వెలలు హెచ్చినపుడు యీ అధికసంఖ్యాకుల కడుపు కొట్టినట్లగును. చాలమంది కూలినాలిచేసి జీవించువారికిది దుర్భరమై దేశసౌభాగ్యమునకే పర్యవసానమున ఆటంకము కలుగును.

వచ్చినమట్టుకే లాభము అని కొందరన వచ్చును. కాని లాభములకన్న నష్టములే ఎక్కువ అగుటవల్ల యీ వాదము కేవల దుర్బలము.

విలువతగ్గింపువలన నష్టములు.

1. ఇంగ్లాండులోని బాకీలకు సవరను ఒకటికి రూ 13-5-0 మాత్రమే మన మిప్పుడు పంపు చున్నాము. రూపాయివిలువ తగ్గినచో సవరను ఒకటికి 15 రూపాయిలు అచ్చుకొనవలసి యుండును.

కేంద్ర ప్రభుత్వముపై భారము భరింపవలసి రాగానే రాష్ట్రములకిచ్చెడిగ్రాంట్లు తగ్గిపోవును అందుచే గ్రామోద్ధరణప్రయత్నములు ఆగి పోవును. కొత్తకొత్తపన్నులు విధింపవలసివచ్చును.

2. ప్రభుత్వమునకు పైవిధమున ఆర్థిక దిక్కులు వచ్చినచో, వారచ్చుకొనవలసిన బాకీలపై వడ్డీలు పెరిగిపోవును. ఆ భారమంతయు దేశమే కదా భరించి అనుభవింపవలయును.

3. స్వదేశ లాభమును మాత్రమే యోచింపక ఇతరదేశములకు నష్టము కలిగించెడి యీ ప్రయత్నమును చూచి విదేశీయులు ఊరకుండరు. వారు ప్రతిక్రియలు పన్నుదురు. సరకు దిగుమతులపై నిషేధములను హెచ్చింతురు. వ్యాపారమే తగ్గిపోవును. వ్యాపార బాహుళ్యము దేశమునకు క్షేమము కాని, వ్యాపార దైన్యము కాదు.

4. బ్రిటను, జపాను దేశములతో హిందూ దేశము చేసికొనిన ఒడంబడికలు మార్పుచెంద నున్నవి. ఇట్టిస్థితిలో మారకపురేటు తగ్గించుటకు వారొప్పుకొనక మన దేశమునకు నష్టకారణమగు షరతులను కోరెదరు. వారితో వ్యాపారము

మనము నిరాకరించలేము. కాబట్టి వారిషరతులకు ఒప్పుకొన్నను నష్టము. ఒప్పుకొనకున్న అసలు వ్యాపారమునకే ప్రమాదము.

5. రూపాయివిలువ తగ్గించి ధనమార్జించెడి పద్ధతి వ్యాపారస్థులు రుచి చూడగానే ఇదే బాగున్నదని మరిమరి తగ్గింపచూతురు. ఈఅధో మార్గమున మనము జారిపోవుట కారంభించితి మేని ఎక్కడ పోయి నిలుతుమో ఎవ్వరును చెప్పజాలరు.

### ఫలశ్రుతి

కాబట్టి ఇన్నినష్టములకు ఆకరమగు విధానము ననుష్ఠించుట సరియా? ఫ్రాన్సు మొదలయిన దేశములు చేయలేదా అనిన అక్కడి విషమపరిస్థితులకును ఇక్కడి పరిస్థితులకును కొండలంత భేదములున్నవి. ప్రపంచమున ఇండియా దేశ ఆర్థికగౌరవ మిప్పుడు ఉన్నతదశయందున్నది. మహాపరాక్రమవంతములగు దేశములు సహితము పొందలేని పరపతిలాభము, మన దేశము కొలదిసంవత్సరములలో పొందగలుగుచున్నది. వ్యాపారము విజృంభించుచున్నది. వ్యాపారబాధకములగు నిషేధములను విదేశములు తొలగించినతోడనే మన వాణిజ్యము మరింత వృద్ధికాగలదు. ఇట్టి పరిస్థితులలో మనము రూపాయివిలువ తగ్గింతుమని ప్రస్తావించి మాటలాడుటకూడ ప్రమాదకరమే అగును.

(జనవాణి 3-11-36)

---

(201 వ పేజి తరువాయి)

తప్పని నిరూపిస్తూ ఏజంట్లకు యీ వృత్తివిద్యకు సంబంధించిన విజ్ఞానమునకున్నూ, లైసెన్సునకున్నూ, యత్నించిన రిబేటుకు అంతగా తావుండదని సలహానిచ్చారు. ఈ సలహాను అంతగా పాటించక రిబేటుయిచ్చే యేజంట్లను ఇండియన్ పీనల్ కోడ్ప్రకారం శిక్షాపాత్రులను చేయాలనే భీమాతత్వవేత్త లున్నారు. అట్టి వేత్తలలో బాగా చాటగలిగే భీమాపండిత సంతానంగారే ప్రస్తుతంలో బాగా కనబడుతున్నారు. వీరినే మిగతావారు అనుసరించితే అనుసరించవచ్చు. అంతేనేగాని సంతానంగారు అన్నది బాగా లేదని చెప్పే ఏ ఇతరభీమాకంపెనీ కార్యనిర్వాహకులు ఇంతవరకు కనబడరు. దీనినిబట్టి ఆలోచించితే ఏమికనబడుతోందనగా బలసిన కంపెనీల పద్ధతులనే తాళం వేయకపోతే బక్క కంపెనీలు తమబక్కతనం ఎక్కువవ్వల్లనై అసలే నిలువలేక ఎప్పుడు పడిపోతామో అను భయంతో నోరుమూసుకుని పూరుకుంటునట్లు కనబడుతుంది. కంపెనీలమాట ఎటున్నా, ఏజంట్ల సంఘాలవారు యీవిషయములో లైసెన్సునకున్నూ యిందుకు సంబంధించిన విజ్ఞాన వ్యాపకమునకున్నూ, తగిన కట్టుదిట్టాలు రాబోవు ఇన్సూరెన్సు సవరణ చట్టంలో చేయించుటకు కృషిచేయవలసివుందని గ్రహింతురుగాక.




# భీమా - ఆవశ్యకత

## మానవుని విరోధులు - ప్రమాదములు, ప్లేగు, కలరా వగైరాలు.

### ప్ర మా ద ము లు.

లాహోరు, 23 సెప్టెంబరు, 36:—

లాహోరునకు పదిమైళ్ళదూరమున, ముల్టాన్ రోడ్డుమీద, ప్రయాణీకులతో నిండియున్న రెండు లారీలు ఢీకొని తిరుగబడెను. ప్రయాణీకులలో చాలామందికి ప్రమాదమైన గాయములు తగిలినవి.

*     *     *     *

కాశీ : 9 సెప్టెంబరు, 36:—

గంగానదిలో పడవ మునిగిపోవుట:—

చతామీ గ్రామమువద్ద, గంగానదిలో, ప్రయాణీకులతో నిండియున్న పడవ తిరుగ బడి మునిగిపోయెను. ముగ్గురు పడవవారు ప్రయాణీకులలో కొద్దిమంది మాత్రము ప్రమాదము నుండి తప్పించుకొనగలిగిరి. మిగిలినవారు ప్రవాహములో కొట్టుకునిపోయి మరణించిరి.

*     *     *     *

జారియా 20 సెప్టెంబరు, 36:—

జీవించియుండగనే పాతిపెట్టబడుట:—

బీహారీలో నిలూరి పతూరి కాలరిలో సాయంత్రము 6 గం॥ సమయమున, పనివాండ్రు ఒక స్తంభమును గోయుచుండగా, గని కూలి చాల మందికి ప్రమాదకరమగు గాయములు తగిలి పలువురు మరణించిరి.

*     *     *     *

7 లక్నో, సెప్టెంబరు, 36:—

లక్నోయందు ఒక పెద్దగోడ పగిలిపడుటచే, ఒకడు మరణించెను. నలుగురుకు బలమగు గాయములు తగిలెను.

*     *     *     *

లక్నో, 14 సెప్టెంబరు, 36:—

లక్నోలో 5 గంటలలో 14 అంగుళముల వర్షము కురిసి, సుమారు 100 యిండ్లు కూలి సుమారు పదకొండుమంది మనుష్యులు చనిపోయిరి.

*     *     *     *

హైదరాబాదు, 12 సెప్టెంబరు 36:—

మోటారు నూతులో బడుట :

హైదరాబాదులో అడిగమెంటు రోడ్డుమీద మోటారు పోవుచూ, కంట్రోలు తప్పి, ప్రక్కనున్న ఒకపెద్దబావిలో పడి మునిగిపోయెను. మోటారులో నున్నవారందరు వెంటనే మరణించిరి.

*     *     *     *

మద్రాసు, 12 సెప్టెంబరు, 36:—

మెట్టుకులం అనుగ్రామములో, పూనమల్లి వద్ద, మోలవన్, అను నలుబదేండ్లయువకుడు, బండిక్రింద పడెను. బలమైనగాయములు తగిలెను.

*     *     *     *

బొంబాయి:—

పాడీలో, మందుగుండుసామాను తయారు చేయు ఫ్యాక్టరీలో, ఏదో ప్రమాదకరమైన వస్తువు పగిలినందున చాలమందికి ప్రబలమైన

గాయములు తగిలెను. ఒకమనిషి వెంటనే మరణించెను.

*   *   *   *

25 సెప్టెంబరు 36:—

రాజఖార్సవన్ స్టేషనులో ప్రమాదకరమగు ఒకవస్తువు పగిలి చాలమందికి బలమగు గాయములు తగిలి ఒకమనిషి వెంటనే మరణించెనని అసిస్టాంటు ట్రాన్సుఫోర్టేషను ఆఫీసరు తెలిగ్రాము నిచ్చిరి.

*   *   *   *

కలరా, ప్లేగు వగైరా!

17 షేక్కోట: సెప్టెంబరు 39:—

షేక్కోటయందు కలరా ఉపద్రవముగా వ్యాపించియున్నది. సెప్టెంబరు నెలలో 12 వ తారీకులోపల పదునారుగురు యీవ్యాధివల్ల మరణించిరి.

*   *   *   *

27 పాల్ఘట్ సెప్టెంబరు 1936:—

ఈపురమునందు కలరా ప్రబలముగా వ్యాపించి చుట్టు ప్రక్కలనున్న అగ్రహారములకు కూడ ప్రాకుచున్నది. ప్రతి దినమున పలువురు మరణించు చున్నటుల వార్తలు తెలియుచున్నవి.

*   *   *   *

అంబసముద్రము 21 సెప్టెంబరు 1936:—

ఈవూరునందు కలరా ప్రబలముగా ప్రాకి ప్రతిదినమున నలుగురు లేక అయిదుగురు చనిపోవుచుండిరని తెలియుచున్నది.

*   *   *   *

కేలికట్ 16 సెప్టెంబరు 1936:—

ఈప్రదేశమున కలరా తీవ్రముగా వ్యాపించినది. కోదుంబా, కోడువయూరు, పోల్పల్లి, పెనయూర్, మొదలగు గ్రామములయందు తీవ్రముగా పాకుచున్నది. కలరా తగిలిన 21 మందికి పదకొండుగురు చనిపోయిరి.

*   *   *   *

ప్లేగు:—రయాడ్రిగల్లో ప్లేగు విపరీతముగా ప్రబలి 75మందికి68గురు చనిపోయిరని తెలియుచున్నది.

*   *   *   *

మద్రాసులో డిఫ్తేరియారోగము:—

ఈనెలలో 13 డిఫ్తేరియా రోగులలో ఒక మనిషి చనిపోయెనని తెలియుచున్నది.

మెత్తుపాలయం, నెల్లూరు, సౌత్ ఆర్కాటు, తిరుచునాపల్లి, తంజావూరు, రామ్నాడు, తిన్నవేలీ, అనంతపూర్, చిత్తూరు, సేలం, కోయంబత్తూరు, విశాఖపట్టణము, కృష్ణా, చంగల్పట్, సౌత్కనరా, మలబారు, చెన్నపురి, మొదలగు జిల్లాలయందు ఈ జబ్బు విపరీతముగా ప్రబలిపోయినది.

మసూచికము:— తిన్నల్వేలీ, మలబారులలో మసూచికము చాల విపరీతముగనున్నది.

చెన్నపురి రాజధానిలో 18 సెప్టెంబరు 1936 సంllములో తయారుచేయబడిన లెక్కలు యీ క్రిందరీతిగ నున్నవి.

| | | | |
|---|---|---|---|
| కలరా | 908 మందికి | 504గురు | మరణించిరి- |
| మసూచికము | 119 ,, | 23 ,, | ,, |
| ప్లేగు | 15 ,, | 14 ,, | ,, |

(ఇండియన్ పాలసీహోల్డరు)

తనువులు శాశ్వతములుగావు. ఏరోజునకు, ఏనిమిషమునకు ఏమివచ్చునో ఎవ్వరికిని తెలియదు. మీకుటుంబములు ఆర్థికముగ మీపై ఆధారపడియున్నవి. మీరులేనిదే మీకుటుంబమునకు రాబడి లేదు. కనుక మీజీవితములను ఆర్థికముగ బలపరచవలసిన ఆవశ్యకత గలదు. అటుల చేయవలెనన్న మీజీవితములను భీమాచేయుటచే ఆవశ్యకత తీరగలదు.      (సంపాదకుడు.)

# భీమా సమాచారములు
## (Insurance News)

**శ్రీ॥ వి. డబ్ల్యూ. తంబియాగారు :**

ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అస్యూరెన్సుకంపెనీ లిమిటెడు, బొంబాయి, యొక్క మలయా బ్రాంచి శకట్రెటరీగారగు శ్రీయుత వి. డబ్ల్యూ. తంబియాగారు, 45 వ యేట, ఆగస్టు 29 వ తారీకున కాలధర్మము నొందిరని తెలుపుటకు మే మెంతయు చింతిల్లు చున్నాము.

కౌలాలంపూర్‌నందు అఖండమైన వ్యాపారమును సంపాదించుటకు శ్రీ తంబియాగారి నిరంతర కార్యదీక్షయే కారణము. ఆపూరునందు ఓరియంటల్ కంపెనీయొక్క బ్రాంచిఆఫీసునకు గాను కట్టిన భవనము వీరి అధ్వర్యముననే కట్ట బడెను. వీరి మరణమువల్ల ఓరియంటల్ కంపెనీ వారికి దీరని లోటు వాటిల్లినది. భగవంతుడు వారి ఆత్మకు శాంతి నొసంగుగాత.

* * * *

మాడరన్ ఇండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడువారున్నూ, యునైటెడ్ అస్యూరెన్సుకంపెనీలిమిటెడు వారున్నూ, హిందూ దేశపు భీమాచట్టము ననుసరించి గవర్నమెంటువారికి కట్టవలసిన డిపాజిటు మొత్తములను డిపాజిటు చేయకపోవుటచే గవర్నమెంటువారు సదరు రెండుకంపెనీలవారికి నోటీసులను యిచ్చియుండిరి. వెంటనే యునైటెడు అస్యూరెన్సువారు రు 50,800 లు, మాడరన్ ఇండియా లైఫ్ అస్యూరెన్సుకంపెనీ లిమిటెడువారు రు 63,500లు విలువగల ధరావతులను డిపాజిటుచేసియుండిరి.

* * * *

**యఱ్ఱాప్రగడ సత్యనారాయణమున్షీ గారిపై కేసు:**

యఱ్ఱాప్రగడ సత్యనారాయణ అను నొక యువకుడు గ్రేట్ ఓరియంటల్ బ్రిటీష్ ఇన్సూరెన్సు కంపెనీ ఏజంటునను మిషతో, రాజమహేంద్రవరమునందు ప్రీమియములను, అడ్మిషనుఫీజులను వసూలు చేయుచున్నట్లు తెలియవచ్చినది. పోలీసువారికి యీవార్త తెలియగానేవారు తీవ్రమగుచర్యనుతీసుకుని వాకబుచేయగా బొంబాయి నగరమునందు, గ్రేట్ ఓరియంటల్ బ్రిటిష్ ఇన్సూరెన్సుకంపెనీ అను కంపెనీ లేనే లేదని తెలియవచ్చెనట. 420, 466, 471 I. P C సెక్షనులక్రింద నేరస్తునిపై కేసు తేబడెను. రాజమహేంద్రవరపు అసిస్టాంటు సెషన్సు జడ్జిగారు కేసును విచారించుచున్నారని తెలియుచున్నది.

* * * *

**జపానులో భీమావ్యాపారాభివృద్ధి :**

ప్రధమమున జపాను దేశములో 1879 సం॥లో ఒక మేరిన్ కంపెనీ యొకటి స్థాపింపబడెను. జీవిత భీమావ్యాపారము 1881 సం॥లోను, అగ్ని భీమా 1888 సం॥లోను, ప్రమాదపు భీమా, 1911 సం॥లోను, ప్రారంభింపబడెను. ఇప్పుడు జపానులో 47 దేశీయకంపెనీలు 33 విదేశీయ కంపెనీలు పనిచేయుచున్నవి. 33 విదేశీయ కంపెనీలలో 19 కంపెనీలు యింగ్లీషువారివి, 7 కంపెనీలు డొమినియన్, కాలనీలు, మొదలగువారివి, 3 కంపెనీలు అమెరికావారివి, 2 చైనావారివి, 1డచ్చివారిది. జపాను దేశపుకంపెనీలవారు మూడు విధములగు భీమావ్యాపారమునుచేయుచున్నారు. (1) ఇండస్ట్రియల్ ఇన్సూరెన్సు; (2) నిర్బంధక ప్రమాద, ఇన్సూరెన్సు; (3) జీవిత భీమా వ్యాపారము. ప్రస్తుతము ఈదేశమువారు భూకంపపుభీమావ్యాపారమునుగురించితీవ్రముగా ఆలోచించుచున్నారు.

జపాను దేశమువారి భీమావ్యాపారమంతయు

విదేశీయ, ముఖ్యముగా ఆంగ్లేయమార్టలిటీ టేబిలు ననుసరించి పనిచేయుచున్నది. ఈ దేశములో సాధారణముగా క్షయరోగమువల్ల మరణించు సంఖ్య అధికముగా నున్నది. 1933-34 సం॥పు లెఖలను తెలుపు పట్టీని చూచిన నూటికి 18.5 మంది పురుషులు, నూటికి 15.4 మంది స్త్రీలు, క్షయరోగముచే మరణించుచున్నట్లు తెలియుచున్నది.

ఈ దేశమువారు 1914 సం॥లో మోటారు ఇన్సూరెన్సు వ్యాపారమును ప్రారంభించిరి. 1933-34 సం॥లో మోటారుకారులను ఇన్సూరు చేసినసంఖ్య టోకియోలో రిజిష్టరీఅయిన మోటారులసంఖ్యలో సగమునకు మించియున్నట్లు తేలుచున్నది.

విదేశభీమాకంపెనీలు జపానుదేశములో జీవిత భీమావ్యాపారమును చేయవలెనన్న 1900సం॥పు సూపరువిజన్ చట్టము ననుసరించి 150,000 యెన్నులను తదితర భీమావ్యాపారములను చేయవలెనన్న 100,000 యెన్నులను డిపాజిటు చేయవలెను. (ఇండియన్ పాలసీ హోల్ డర్)

* * * *

పీసపాటి పున్నకోటయ్యగారు, యింతవరకు పనిచేయుచున్న ఇండస్ట్రియల్ అండ్ ప్రూడెన్షియల్ ఇన్సూరెన్సుకంపెనీ ఏజన్సీకి రాజానామా నిచ్చి భారత, ఇన్సూరెన్సుకంపెనీకి ఏజంటుగా పనిచేయుచున్నారని తెలియుచున్నది.

* * * *

వీపువిలువ 50,000 డాలర్లు:—

ప్రఖ్యాతగాయకురాలు, పేరుపొందిన అభినేత్రి, గెర్ట్రూడ్ నీశెన్ అను నామె తన వీపును 50,000 డాలర్లకు ఇన్సూరు చేసినదట. ఈవిడవీపుతో సరిపోల్చదగిన లావణ్యముగల వీపు మరొక అందకత్తె కెవరికి లేదట. అందుచే "లాయడ్సు ఆఫ్ లండన్" (ఇన్సూరెన్సుబ్రోకర్లు) 50,000 డాలర్లకు ఈవిడవీపు ఇన్సూరుచేసిరట. "గీతలుపడినా, గాయాలుతగినా, ఎండకువాడినా, అగ్నివల్లను, నీటివల్లనూ, ఎల్లవేళలా దేనివల్ల కూడా ప్రమాదము కలుగకుండా" హిరణ్యాక్షునివరంలాగ సంరక్షింపబడుతున్నది, యీమె వీపు.

(ఆంధ్రపత్రిక)

* * * *

ఇన్సూరుచేసిన యిల్లు కాలిపోయినది:—

ఒక ఇల్లు అగ్నిఅంటుకుని కాలిపోయినది. ఇద్దరు బ్రిటిష్ బ్రహ్మచారులకు కొంచెము గాయములు తగిలినవి. ఆయింటిని రు 35,000 లకు ఇన్సూరుచేసిరి ఇంటివలన నష్టము రు 21,000లు అని తేలినది. (జనవాణి)

* * * *

ప్రపంచముయొక్క వయసు:—

ప్రపంచముయొక్క వయసును గూర్చి ఖగోళశాస్త్రజ్ఞులలో అభిప్రాయభేదములు గలవు. "ప్రపంచము యిప్పుడెటు లున్నదో అటులనే 10,000,000,000,000 సంవత్సరములనుండియును నిలిచియున్నది." అని బ్రిటనుదేశీయుడగు సర్ జేమ్సుజీన్సుగారు తెలిపిరి.

"ప్రపంచము 20,000,000,000 సంవత్సరములనుండి మాత్రమే నిలచియున్నది." అని అమెరికా సంయుక్తరాష్ట్రములలో హార్వరుడు విశ్వవిద్యాలయమునందు ప్రొఫెసరుగా నున్న డాక్టరు బాకుగారు తెలిపిరి. ఇవి రెండును గూడ మనకు అగ్రాహ్యములుగానే యున్నవి. జీన్సుగారి అంచనాలోకంటె, బాకుగారి అంచనాలో 100 కి ఒకటివంతున తక్కువగా నున్నది.

(ఆరోగ్యపత్రికాశిక)

* * * *




శ్రీయుత వి. సుబ్రహ్మణ్యంగారు, బి. ఏ.

ఇన్సూరెన్సు ఎక్స్పర్టుకమిటీ తన పనులను చక్కగా నెరవేర్చుచున్నదనియు, ఈ నెల మూడవవారము ఆఖరున తన పనిని సమాప్తి చేయునని ఢిల్లీనుండి వార్తలు తెలియవచ్చినవి. కమిటీవారు చేసిన నిర్ణయములు ఏకగ్రీవముగా లేవు. ఇండియన్ కంపెనీ లనియు, నాన్ ఇండియన్ కంపెనీలనియు ఈ కమిటీ రెండు చీలికలుగా విడిపోయిన దనుట అతిశయోక్తిగాదు. తన జీవితమంతయు ఒక విదేశ కంపెనీతో సంపర్కము కలిగియున్నట్టియు, ఈ మధ్యనే ఆ పనినుండి విరమించినతరువాత ఒక యిండియన్ కంపెనీ బోర్డుమెంబరుగా జేరినట్టియు, సర్ ఫిరోజ్ సేత్నాగారు, నాన్ఇండియన్ కంపెనీలకు తీవ్ర పక్షపాతిగ నుండుట వాటియొక్క అదృష్టమని జెప్పవచ్చును. ఇండియను కంపెనీల ప్రతినిధు లేమైన సలహాలు చెప్పినట్లైతే విదేశకంపెనీలున్ను, సర్ ఫిరోజ్ సేత్నాగారున్నూ, అభ్యంతరములు చెప్పుచున్నారు. ఇండియన్ల అవసరములను బలపరచు బలమైన కార్యకారణములు, వానికి సంబంధించిన అంకెలు, ఇండియన్ కంపెనీలవారు చేకూర్చి యుంచుటచే సర్ ఫిరోజ్ గారి ప్రవృత్తివల్ల వారి కేవిధమైన నష్టము గలుగదు.

**విదేశీయులు పూర్తిగా ఓడిపోయిరి:—**

ఈ నెల 10 వ తేదీని సర్ ఫిరోజ్ సేత్నాగారు డైరెక్టరుగా యున్న ఒక యిండియన్ యిన్సూరెన్సు కంపెనీయొక్క యూరోపియన్ జనరల్ మేనేజరు, కమిటీవారి యెదుట అద్భుతమైన సాక్ష్యమొసగెను. ఇన్సూరెన్సు కంపెనీల మీద అవసరమగు యాజమాన్యము కలిగియుండుటకు లైసెన్సుపద్ధతి పెట్టవలెనని ఆయన చెప్పెను. ఇండియన్ కంపెనీలకంటె నాన్ఇండియన్ కంపెనీలు ఎక్కువ మొత్తములు డిపాజిటు కట్టవలెనని ఆయన అభిప్రాయపడెను. ఆయన చెప్పిన విషయములో యధార్థమును గ్రహింపలేక సర్ ఫిరోజ్గారు, నాన్ఇండియన్ కంపెనీల ప్రతినిధులు చాలసేపు ఆయనను క్రాసు ఎగ్జామినేషను చేసినట్టు తెలియుచున్నది. ఇండియన్ కంపెనీలకు నాన్ఇండియనుకంపెనీలకు తారతమ్యము చూపినట్టయితే విదేశములలో మనకు ప్రతిక్రియచేయుదురన్న సంగతి మనకు తెలుసునని చెప్పిరి. ప్రస్తుత పరిస్థితులను ఆయన పరిశీలించి విదేశములలో ఇండియన్ కంపెనీలనుండి డిపాజిటు మొత్తములను ఎక్కువచేసే సూచనలేమీ లేవని ఆయనగ్రహించెను. విదేశకంపెనీలనుండి ఎక్కువడిపాజిటువసూలు చేసే పద్ధతి బ్రిటీషుకాలనీలలోనుయింకాఅనేక దేశములలోను అమలులో నున్నవి. ఇండియన్ కంపెనీలుగాని, బ్రిటిష్కంపెనీలుగాని ఆ దేశములో ఇన్సూరెన్సు వ్యాపారముచేసినను, యికముందు చేయ దలపెట్టినను ఆకంపెనీలవద్దనుండి ఎక్కువ డిపాజిట్లను వసూలుజేయుదురు.

ఓరియంటల్ లైఫ్ ఆఫీసు మేనేజరుగా రగు శ్రీయుత జోన్సుగారు ఇకముందు యిరువదిసంవ

